

బ్రహ్మచారి
అభిరామచైతన్యుల
'భజించు మనసా'
గేయ రూప గ్రంథాన్ని
ఆవిష్కరిస్తున్న
శ్రీచరణులు

**PURANAPANDA SRINIVAS** M.A
Chief Editor, BHAKTI RANJANI
*(A Philosophical Monthly Journal)*
First Floor, 21st Century Complex,
Nampally, Hyderabad
Cell : 98481 98471, Off : 6788874

Date : 11-12-2001





300 UP

# ఈ జన్మకిదొక్కటి చాలు!

కాశ్మీరు నుండి కన్యాకుమారి వరకు పవిత్ర భారతదేశం ఒక మత సంక్షోభంలో పడి ఉద్విగ్నంగా ఉన్న సంక్షుభిత సమయంలో అవతరించిన మహాపురుషులు ఆది శంకరాచార్యుల వారు.

ఎనిమిదో ఏటనే సకల వేదాలలో పాండిత్యాన్ని సంపాదించి, పన్నెండవ ఏటికి సర్వ శాస్త్రాధ్యయనంతో జ్ఞానాన్ని సంపాదించి ముప్ఫైరెండవ ఏటికి తన పాంచభౌతిక శరీరాన్ని వదిలిన మహాజ్ఞాని ఆయన.

అద్వైత తత్త్వ సిద్ధాంత ప్రబోధంతో నాస్తిక వాదాన్ని ఈ దేశపుటెల్లలు దాటించిన శంకర భగవత్పాదుల అమర లేఖిని నుండి జాలువారిన అమృత స్తోత్రం... **"భజగోవిందం".**

ఆదిశంకరుల అపూర్వ గ్రంథ కోటిలో ఒక్కటిగా... మరీ ముఖ్యంగా చిన్నదిగా కనిపించినా... అఖిల లోకాశ్చర్యకర సౌందర్యసారంతో అపూర్వ వేదాంత సూత్ర మాలికగా శబ్ద సౌందర్యంతో విరాజిల్లుతోంది. ఇది చదువుతున్నంత సేపు... విన్నంత సేపు... చెవులకూ, కళ్ళకూ కఠిన భాషాప్రయోగశాలలు కనిపించవు. కుటిల తర్కాలు ఆవిష్కరించబడవు. ఏదైతే జీవనానికి ముఖ్యమో అదొక్కటే అనేక సార్లు దర్శనమిస్తూంటుంది.

మనస్సుని మనముందుకు తీసుకువచ్చి, కొరడా దెబ్బలతో ఝుళిపించి, అత్యుత్తమంగా సంస్కరించే హెచ్చరికలే ఈ శ్లోకాలు.

భజగోవిందంలోని ప్రత్యక్షరమూ ఒక సద్గురువై ఉపదేశం చేస్తుంది. ఇది గుండెకుపడితే చాలు! మనిషి మృగత్వాన్ని వీడి ఋషిత్వంతో ప్రయాణిస్తాడు.

ఇదిగో... ఈ వెలుగు మార్గంలో నడుస్తున్న సత్కర్మానుష్ఠాతలు బ్రహ్మచారి అభిరామచైతన్య గారు.

క్షణక్షణం తన కణంకణం భగవత్సేవకే అర్పణం చేస్తున్న ధన్య జీవనులైన అభిరామ చైతన్య గారి రచనలు తేనెకు తోబుట్టువులై దర్శనమిస్తుంటాయి.

ఆధ్యాత్మిక రచనా మార్గంలో వీరిదొక వినూత్న ప్రక్రియ.

అదేమంటే... అటు ఉపనిషత్తులను, ఇటు భజగోవిందం వంటి అత్యుత్తమ స్తోత్రాలను గేయ రూపంలోకి విలక్షణంగా అనువదించి అపూర్వంగా గానం చేయడం వీరికి వెన్నతో పెట్టని విద్య.

శంకరాచార్యులందించిన అమృత కలశం "భజగోవిందం"ను 'భజించు మనసా!' గా గేయ రూపంలోకి అనువదించిన శ్రీ అభిరామచైతన్య గారు తన మంగళ గళంతోనే ఈ గేయామృతాన్ని ఓ చలిప్రొద్దుటి వేళ వినిపించడం, ఆ పవిత్ర సౌందర్య మాధుర్యాన్ని నేను ఆస్వాదించడం ఓ మహద్భాగ్యంగా జరిగిన హఠాత్సంఘటన.
పులకించాను అంటే తప్పు! పరవశించాను అంటే ఒప్పు!!

ఒక ప్రక్క గంభీరంగాను, మరో ప్రక్క ప్రసన్నంగాను,

శ్రీ అభిరామ చైతన్య గారు ఈ గేయరూపాన్ని గానం చేస్తుంటే ఒక కవిత్వ గోదావరి, ఒక పవిత్ర గంగమ్మ మనస్సు ముందు సాక్షాత్కరించాయి.

భాష సరళంగా, లలితంగా నిలిచింది.

గానం మధురంగా, ఆకర్షణగా సాగింది.

మూడు మాటల్లో చెప్పాలంటే...

బ్రహ్మచారి అభిరామ చైతన్య గారి తపస్సు ఫలించింది.

ఆయన నిత్యం ఆరాధించే దైవం అనుగ్రహించింది.

అగ్నివర్ణ భాస్కరులైన సద్గురువులు శ్రీశ్రీశ్రీ దయానంద సరస్వతీ స్వామీజీవారి దివ్య కృప సంపూర్ణంగా వర్షించింది.

**ఈ మూడూ చాలు ఈ జన్మకి !**

భజించు మనసా ... గేయ రూప గ్రంథం బ్రహ్మచారి అభిరామ చైతన్య గారి రచన జీవనంలో ఓ రసవద్ఘట్టం.

ఇది పవిత్ర జ్ఞాపకం.

ఈ జ్ఞాపకాన్ని తన సద్గురువుల అమృత హస్తాలతో ఆవిష్కరింపచేసుకోవడం గేయకర్త పురాకృతజన్మసుకృతం.

ప్రేమ పూర్వకంగా శ్రీ అభిరామ చైతన్య గారిని నాకు పరిచయం చేసిన సంస్కార మూర్తులు, సంగీత ప్రియులు, 'శ్రీ భారతి' సంస్థాపకులు శ్రీ చింతలపాటి సురేష్‌గారి సహృదయానికి కృతజ్ఞతలు తెలియజేస్తూ ...

శ్రీ గణపతి భగవానుని పవిత్ర చరణాలచెంత శిరస్సు వంచుతూ...

**- పురాణపండ శ్రీనివాస్**

# భజించు మనసా...

(జగద్గురువులు ఆదిశంకరాచార్యుల
'భజగోవిందం' శ్లోకాలకు గేయరూపం)

## బ్రహ్మచారి అభిరామ చైతన్య

(Seva Pramukh - AIM FOR SEVA-A.P.)

ప్రచురణ :

శ్రీ భారతి

(సంగీత, సాహిత్య, కళా వికాస వేదిక)

విష్ణుపురి, మల్కాజ్‌గిరి, హైదరాబాద్

# భజించు మనసా...

(జగద్గురువులు ఆదిశంకరాచార్యుల
'భజగోవిందం' శ్లోకాలకు గేయరూపం)


## అభిరామ చైతన్య

(Seva Pramukh - AIM FOR SEVA, A.P.)



Sketch by : Vivekananda Talents Society, Hyd.
Printed at : Sri Pochamma Graphics, Hyd.

వెల: రూ. 12/-

ప్రతులకు:
చింతలపాటి సురేష్
ప్రధాన కార్యదర్శి
శ్రీ భారతి
(సంగీత, సాహిత్య, కళా వికాస వేదిక)
ఇం.నెం. 24-60/18[illegible]
విష్ణుపురం, మల్కాజ్‌గిరి, హైదరాబాద్



పుణ్యమార్గంలో నడిచి

జీవనాన్ని ధన్యమయం చేసుకున్న

పండితోత్తములు, మా పితామహులు

**కీ.శే. రామమూర్తి శాస్త్రి, అన్నపూర్ణమ్మ**



మాకు జన్మనివ్వడమే కాకుండా,
జీవచైతన్యమైన సంస్కారప్రద నడకను ప్రసాదించిన
వెలుగు - వెన్నెల్లాంటి మా అమ్మానాన్నలు

**వేంకట కృష్ణారావు, వరహారుక్మిణి** గార్ల

హృదయ సంస్కారానికి, ఆత్మసౌందర్యానికి మనసే
చేతులు చేసి ప్రణామాలర్పిస్తున్నాం.

- అభిరామ చైతన్య



నా జీవన సౌందర్యంలోకి అర్ధాంగిగా నడిచి
రెండు దశాబ్దాలనాడు భూతలంపై నన్ను విడిచి
పరమాత్మ పదపద్మాల సేవకు నా జీవనం అంకితం
కావడానికి ప్రత్యక్షంగా, పరోక్షంగా కారణభూతురాలైన
నా ఇంటి వెలుగు, నా వెలుగు పలుకు

**కీ.శే. లలిత** కు

కృతజ్ఞతకంటే పై పదాన్ని సమర్పిస్తున్నాను.

**SWAMI DAYANANDA SARASWATI**

**PURANI JHADI**
**RISHIKESH 249 201**

*Bhaja Govindam is a book that draws the attention of human beings to the real human goal. Even though artha and kama are counted as purusharthas worth pursuing they have their limitations. In this small book of captivating verses the limitations of these popular purusharthas are exposed and the real human goal as moksha is presented. There is, therefore, a scathing attack on artha and kama pursuits including the pursuit of punya, Sensitive handling of such attacks is imperative when the reading public are innocent lay people. I am sure Sri Abhirama Chaitanya has handled the subject matter with great care and sensitivity. He has years of exposure to the teaching. May this book reach a good number of people and help them in purushartha nischaya.*

**- *Swami Dayananda***

# SWAMI PARAMARTHANANDA

*As a student of Vedanta for a long time, you have been leading a life-style in keeping with the scriptural teachings. You are indeed blessed to be associated with AIMS under the guidance of Pujya Swamiji.*

*As a composer in Telugu, you have been able to bring out independent songs as well as Telugu translation of Vedantic works. I have heard you sing some of those songs with 'Bhava'.*

*I am happy to know that Pujya Swamiji is releasing your Telugu translation of Adi Sarkara's* **'BHAJAGOVINDAM'.**

*Wishing you all the best,*

***Swami Paramarthananda***

# అభినందన

శ్రీశ్రీశ్రీ భగవత్పాద శంకరాచార్యులు వారు సంసార సాగరములో మునిగిన వారిని జ్ఞానమనే నావతో ఉద్ధరించుటకు అనేక రచనలు చేసారు. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీతాదులకు భాష్యముతో పాటు అనేక ప్రకరణ గ్రంథాలు ఆవిష్కరించారు. ఏకశ్లోకి (ఒక శ్లోకము) నుంచి ఉపదేశ సహస్రిదాకా చాలా రచనలున్నాయి.

వారి భజగోవిందము చాలా తేలికగా అర్ధమవుతుంది. శ్రవణానందము, సంగీత పరంగా, గానము చేయుటకేగాక, అతి గంభీర భావనలు కలది. జీవితములో లౌకికమైన అర్ధ కామాదులతో లాభములేదని, వ్యాకరణాదులు మోక్షమివ్వ లేవని, జ్ఞానమొక్కటే మోక్షమార్గమని "జ్ఞానాదేవతుకైవల్యమని" చెప్పారు. బాల్యములో క్రీడాసక్తి, యవ్వనములో స్త్రీ, సంసార వ్యామోహము, వృద్ధాప్యములో చేతకానితనము, పరులమీద ఆధారపడటము లాభము లేదన్నారు. అయితే భజగోవిందము సంస్కృత భాషలో నుండుట చేత అందరికి అర్ధముకాదు. శ్రీ అభిరామ చైతన్యగారు ఉన్నత భావనలు గలవారు. పరమ పూజ్యశ్రీ స్వామి దయానంద గారి శిష్యులు, చెన్నై వాస్తవ్యులు అయిన పూజ్యశ్రీ స్వామి పరమార్థానంద సరస్వతి గారి దగ్గర దాదాపు రెండు దశాబ్దములు జ్ఞాన అధ్యయనము చేసారు. వారు భజగోవిందమును చక్కని తేలికయిన భాషలో అనువదించారు. భజగోవిందమునకు అనేక వ్యాఖ్యలలో వున్న విషయాలు, గురు పరంగా అధ్యయనము చేసి విషయములను, సామాన్యముగా తెలియని

విషయాలను కూడా పొందు పరిచారు. ఇంకొక ముఖ్య విశేషమేమిటంటే వారు గాయకులు. ఆ సంస్కారముతో గానము చేయుటకు వీలుగా రచించారు.

వారు, జ్ఞాన నిష్ఠలో పరాకాష్ఠను పొంది సన్యాస దీక్షకు ప్రథమ సోపానమైన బ్రహ్మ చర్య దీక్షను, విశ్వ విఖ్యాతులయిన పరమ పూజ్యశ్రీ దయానంద సరస్వతి గారి దగ్గర బ్రహ్మ చర్యదీక్షను స్వీకరించారు. త్వరలో సన్యాసదీక్షను పొందగలరు. అనేక ఉపనిషత్తులు, భగవద్గీతాదులను అందరు తేలికగా అర్ధము చేసుకొని, గాన రూపములో శాస్త్రజ్ఞానమును పొందుటకు వీలుగా రచించుచున్నారు

'భజించు మనసా' అను రచనలో నన్ను స్పందింపజేసిన ముఖ్య భాగములను మీ ముందుకు తెస్తున్నాను.

"ఎంత తెలిసినా, ఎంత నేర్చినా,
కరువయ్యె మనశ్శాంతి
త్రిలోక సంచారి నారద మునికే,
అందుకొని శాంతించె ఆత్మ విద్యను
సనత్కుమారుని సద్బోధలతో".

"అనివార్యమైనవీ జననమరణాలు
భయ భ్రాంత మయమీక్షణికజీవితం
తప్పదు మరుభూమి రారాజుకైనను
అంతం వున్నది ఆ బ్రహ్మకైనను."

"విలువలెరుగదు వికసించనిబాల్యం
వివరమెరుగదు విరబూసిన యవ్వనం
పరిణతినొందదు పరితపించు వృద్ధాప్యం
విరామమెరుగని మిథ్యాజీవితాన"

"ఎవరు తీర్చిరీ రంగుల హరివిల్లు
ఎవరిచ్చారీ హంగుల సిరిజల్లు
గుర్తించవైతివి విశ్వశిల్పినే
ఊడిపడితివా నీకైనీవే".

"జన్మించలేదిల ఆలుబిడ్డలతో,
జతకూడినామిల బాటసారులమై,
చేరిన ఆనందం, చెదిరిన అనుతాపం
రాకపోకల ఈ రహదారులలో,
సంసారమే ఒక చలివేంద్రము"

"బంధమన్నది భావనమాత్రమే
లేనేలేవిల బంధమోక్షాలు
నిత్యముక్తమైనది శుద్ధాంతరాత్మ
స్వయంసిద్ధము, స్వయం ప్రకాశము"

ఇలా వ్రాస్తూపోతే శ్రీ అభిరామ చైతన్యగారి "భజించుమనసా' అను గ్రంధాన్ని పూర్తిగా అందించాల్సివస్తుంది. సంసార మిథ్యాత్వం, వైరాగ్య

బోధనం, బంధుమిత్రుల అనిత్య ప్రేమలు, కపట సాధువుల ప్రవర్తన, మున్నగు అంశాలను కూలంకషంగా నిశితంగా చర్చిస్తూ,

"అత్యంత దూరం అనాత్మభావం
అతిసామీప్యం సర్వాత్మభావం"

అని ఆ పరమాత్మ తత్వాన్ని విశదపరుస్తూ,

"భగవన్నామమే కలియుగమందున
దాటించునౌక భవసాగరమును
భక్తి కలిగితే భగవంతుడ వీవు
దర్శించగలవు దైవాన్ని అందరిలో
సత్యమెరిగితే అమృతయోగం
ఎరుగనివారికి విషాదయోగం"

అంటున్నారు శ్రీ అభిరామ చైతన్యులు. ఇక మీ ప్రాప్తం, మీ ప్రయత్నం, మీరే ఎన్నుకోండి; అమృత యోగంలో ఓలలాడతారో విషాదయోగంలో మునిగిపోతారో.

భగవంతుని సేవలో,

మీ అందరి

స్వామి ఏకాత్మానంద "ఆనంద కుటీరం"

16-11-20/7బి, సలీంనగర్, మలక్ పేట,

హైదరాబాదు - 500 036.

# మనవి - మన్నన

జగద్గురువులు శ్రీశ్రీశ్రీ ఆదిశంకర భగవత్పాదులు, వ్యాస మహర్షిచే అనుగ్రహించబడి, మరొక 16 సం॥ల ఆయుష్షును పొంది వారి ఆదేశానుసారం తమ శిష్యులతో కలసి వైదిక ధర్మప్రచారముతోపాటు, అద్వైత స్థాపన చేయుటకై దేశాటన చేయు సమయమున, మార్గమధ్యంలో ఒక గ్రామమునందొక వృద్ధ పండితుడు, ఇంటి అరుగుపై కూర్చుని "వ్యాకరణ సూత్రాలను" వల్లించటం చూసి, స్పందించి, ఆసువుగా,

"భజగోవిందం, భజగోవిందం
గోవిందం భజమూఢమతే
సంప్రాప్తే సన్నిహితేకాలే
నహినహిరక్షతి ఢుకృఞ్ కరణే"
అని వారిని మేల్కొల్పారు.

ఇదే పల్లవిగా మరో 16 శ్లోకాలను శ్రీశంకరులు, వారి దివ్యాను గ్రహంచే ప్రభావితులైన వారి శిష్యులు తలకొక శ్లోకం చొప్పున మరో 15 శ్లోకాలు చెప్పటం జరిగిందని విజ్ఞులు తెలియజేస్తున్నారు. అట్టి ప్రబోధపూరిత, వైరాగ్యబోధక, ఆత్మజ్ఞాన ప్రతిపాదక ప్రకరణ గ్రంథాన్ని, గురుపరంపరానుగత అనుగ్రహం చేతను, దైవబలం చేతను ప్రేరితుడనై

"భజించుమనసా" అను మకుటంతో శ్రీశంకరుల "భజగోవిందానికి" గేయరూపం, ప్రతివారు అనునిత్యం పాడుకుందుకు వీలుగా రచించటం జరిగింది.

నాయీ గేయ రూప గ్రంథరచనలకు ఇతోధిక సహకారాన్ని అందిస్తున్న ఆత్మ బంధువులకు, మిత్రులకు, అందుకొని ఆదరిస్తున్న ఆత్మ స్వరూపులందరికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ముఖ్యంగా, నాయీ "భజించుమనసా" అనుగానాన్ని ఆమూలాగ్రంగా చదివి, నేను గానం చేసి వినిపించగా విని, నన్ను ఆశీర్వదిస్తూ అభినందించిన పూజ్య శ్రీ ఏకాత్మా నంద సరస్వతిగారికి నామనః పూర్వక ప్రణామములు.

ఈ గ్రంథాన్ని సర్వాంగసుందరంగా తీర్చిదిద్ది అందిస్తున్న "శ్రీ భారతి" సంగీత సాహిత్య వికాస వేదిక, హైదరాబాద్ వారి ప్రచురణ విభాగపు కార్యకర్తలకు, ముచ్చటగా ముద్రించిన సారథులకు నా అభినందనలు, అభివందనాలు.

అన్నిటికన్నా అతి ముఖ్యమైన విశేషం ఏమిటంటే, 18 సం॥ల క్రితం, రెక్కలు విరిగిన పక్షిలా విలవిలలాడుతున్న నన్ను తననులి వెచ్చని ఒడిలో తీసుకొని, సేద తీర్చి, స్వాంతన చేకూర్చి, నాపరితప్త జీవితానికో పరమార్థాన్ని

ప్రసాదించి, నేను కృతార్థుణ్ణి కాగలందుకు, 1983 సం॥ శివరాత్రి శుభ దినమున, బ్రాహ్మీ ముహూర్తంలో, ఋషీకేశ్‌లోని తన ఆశ్రమమందు మంత్ర దీక్షనొసగి, శాస్త్రాధ్యయమునకై, తన అనుంగురు శిష్యులు, అప్పటి మద్రాసు మహానగరంలో శాస్త్ర బోధనలు చేస్తున్న బ్రహ్మచారి పరమార్థ చైతన్య గారికి అప్పగించారు పూజ్యశ్రీ స్వామి దయానంద సరస్వతిగారు. వారే నా శాస్త్ర గురువులైన పూజ్యశ్రీ స్వామి పరమార్థానంద సరస్వతిగారు వారి శిష్యరికంలో ఇప్పటికీ శాస్త్రలోతులను గ్రహిస్తూ తరిస్తున్నాను.

18 సం॥ల శాస్త్రాభ్యాసంలో, మైనారిటీ తీరినంతనే 26.3.2001, వృషనామ సంవత్సర ఉగాది పర్వదినాన, అదే ఆశ్రమంలో బ్రహ్మచర్య దీక్షను అనుగ్రహించి, "అభిరామ చైతన్యగా నామకరణం చేసి, "ఆచార్యసభ" ఆశీస్సులతో స్థాపించిన 'అఖిలభారత సేవా ఉద్యమంలో (AIM for SEVa) కార్యక్రమాల నిర్వహించుటకై, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి నన్ను సేవా ప్రముఖ్" గా నియోగించిన బ్రహ్మనిష్ఠులు, మార్గదర్శకులు అయిన పూజ్య గురుదేవులు శ్రీశ్రీశ్రీ స్వామి దయానంద సరస్వతిగారు, నేను కోరిన వెంటనే, నాపై ప్రేమతో, యీ "భజించు మనసా" అనుగేయ రూపరచనను, అంకిత మందుకొనుటకు, ఆవిష్కరించుటకు అంగీకరించి ఆశీస్సులనందించటం, నా జీవితంలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన అపూర్వ మహదవకాశం. వారికి నేను సర్వదా కృతజ్ఞుణ్ణి. వారు ప్రారంభించిన AIMS కార్యక్రమాలలో,

నా తుదిశ్వాసవరకూ, పాల్గొంటూ, నా జీవిత చరమాంకానికొక అర్థం, పరమార్థం చేకూర్చుకోగలనని సవినయంగా మనవి చేస్తున్నాను. అందుకు తగిన భక్తి శ్రద్ధలను, శక్తియుక్తులను, నన్ను తీర్చిదిద్దిన పూజ్య గురుదేవులిరువురి అనుగ్రహంతో, ఆపరాత్పరుడు నాకు ప్రసాదించగలడని, ఆ సర్వేశ్వరుని యీ వింతనాటకంలో నన్నొక సమిథగా తరింపజేయగలడని విశ్వసిస్తున్నాను.

ఈ శుభ తరుణంలో, నన్ను పూర్తి మనసుతో ఆశీర్వదించిన శాస్త్ర గురువులు పూజ్యశ్రీ స్వామి పరమార్థానంద సరస్వతిగారి కూడా నా హృదయ పూర్వక కృతజ్ఞతలు, నమస్సుమాంజలులు.

ఇట్లు

భగవత్సేవలో భవదీయుడు

**బ్రహ్మచారి అభిరామచైతన్య**

SREE LALITHA SEVA TRUST
(Regd.)
(Sree Dayananda Pranavasram)
Gopanapally (Vill.)
Seri Lingampally Mandal,
R.R.Dist. HYDERABAD - 500 019.

హైదరాబాద్

1-12-2001



# భజించు మనసా

(జగద్గురువులు శ్రీశ్రీశ్రీ ఆదిశంకరాచార్యులు రచించిన
భజగోవింద శ్లోకాలకు గేయ రూపం)

1. "భజగోవిందం భజగోవిందం
గోవిందం భజ మూఢమతే
సంప్రాప్తే సన్నిహితేకాలే
నహినహి రక్షతి డుకృఞ్కరణే" ॥ భజ ॥

పల్లవి : భజించు మనసా గోవిందనామం
ధ్యానించు మనసా గోవింద రూపం ॥భజిం॥

అను పల్లవి : రక్షించవునిను వ్యాకరణ సూత్రాలు
అవసానకాలాన ఓ మూఢ జీవా
త్యజించు మనసా మమకార ద్వేషం
తరించు జీవా సంసార మోహం ॥భజిం॥

విహరించు మానవుడు తానెవరో తెలియక
జనన మరణాల చక్రభ్రమణంలో
కబళించు మృత్యువు ఏ క్షణమందైన
తప్పింపవు నిన్ను అపరవిద్యలెన్నైన ॥ భజిం ॥

ఎంత తెలిసినా ఎంతనేర్చినా
కరువయ్యె మనశ్శాంతి
త్రిలోక సంచారి నారద మునికే
అందుకొని శాంతించె ఆత్మ విద్యను
సనత్కుమారుని సద్బోధలతో ॥ భజిం ॥

గమ్యమెరుగకే విహరించు పక్షులవలె
భోగజీవనమె పరమార్థమనినమ్మి
అలమటించెదరు ఆరు అజ్ఞాన తిమిరాన
అనిత్యమైనట్టి సుఖభోగతపనలో

తలచిన చాలును అంతిమ సమయాన
దైవనామమని విశ్వసింతురు
జ్ఞప్తికి రాకే పరితపింతురు
మరణ వేదనలో తొలగని మోహాన
ఎన్నడు తలవని ఈశ్వరనామం ॥ భజిం ॥

శ్రవణ, కీర్తనం, స్మరణ, సేవనం ,
అర్చన, వందనం, దాస్య, సఖ్యము,
ఆత్మ నివేదనమను నవ విధ పుష్పాల
పూజింపవలెను ఆజన్మాంతము
ధ్యానించవలెను అనవరతమ్ము
పరమ పావనమగు ఈశ్వరనామం ॥ భజిం ॥

2. "మూఢ జహీహి ధనాగమతృష్ణాం
కురు సద్బుద్ధిం మనసి వితృష్ణాం
యల్లభసే నిజకర్మోపాత్తం
విత్తంతేన వినోదయ చిత్తం" ॥ భజ ॥

దరిజేర్చకోయి ధనార్జనాశను
పరిశుద్ధమగు నీచపలత్వమనసు
అనువైన మార్గం అనితర భజనం
లభించునెంతో సౌఖ్యానందం
అందించు శాంతి అనునిత్యతృప్తి ॥ భజిం ॥

దుర్లభమైనది మానవజన్మమె
దుర్భరమైనది స్వార్థచింతనం
అతి దుఃఖమయ మీ అల్పతృష్ణయే
పడద్రోయునిన్ను భవసాగరాన
త్యజించు వేగంతృష్ణ వికారాల ॥ భజిం ॥

ఉన్నదానితో తృప్తి చెందుట్టే విజ్ఞుల లక్షణం
ఆధ్యాత్మిక ప్రగతికి తృత్యాశయే అవరోధతీక్ష
జీవించవలెను తృప్తిని పొంది గత జన్మప్రాప్తమని
విలసిల్లు శాంతి విజ్ఞత కలిగిన
అదేనీ సౌభాగ్యం, లేకుంటే దౌర్భాగ్యం ॥ భజం ॥

3. "నారీస్తన భర నాభీదేశం
దృష్ట్వా మాగా మోహావేశం
ఏతన్మాంస వసాది వికారం
మనసి విచిన్తయ వారం వారం" ॥ భజ ॥

ఆకర్షించునిను వనితల వక్షోజాలు
మోహపరచు నిను నాభీ ప్రదేశాలు
భ్రమింపజేసెడి ఇంతుల సౌందర్యం
మాంస వికారం మన్మథ ప్రేరణయే
విచారించవలె నీ సత్యతత్వాన్ని
అవలోకించవలె మిథ్యాతత్వాన్ని ॥ భజం ॥

కలుషితమగు నీ క్షణికావేశాన
ప్రశస్త జీవితం నీచ పశువృత్తికి
మానవ దేహమే అస్థిపంజరం
నవరంధ్రముల తోలుతిత్తి అది
సుందర చర్మాన ఆచ్ఛాదితం
రక్తమాంసముల గుజ్జనగూడది
కానేకాదది సౌందర్య మందిరం
దుర్గంధపూరిత మలిన కూపమ్మది ॥ భజం ॥

కుచకుంభాలా అవి మాంసపు ముద్దలు
నాభీ దేశమా అది ఆహార మార్గం
మాతృగర్భాన శయనించు సమయాన
దూరపుకొండలే నునుపని తలచి
భ్రమచెందకోయీ పాపచింతనతో
జీవనాధారమగు క్షీరతల్పమది ॥ భజిం ॥

నవయువతి అందాలు నేతిబీరచందాలు
నేయి వుండదందులో పీచు, నీరమే
వ్యామోహమెందుకు అల్పసుఖానికై
బుద్బుదప్రాయమీ మానవ జీవితం ॥ భజిం ॥

స్త్రీపై పురుషునికి ఎంతకామమో
స్త్రీకి పురుషునిపై అంతేకామం
చింతించు వాస్తవం గుర్తించు తల్లిని
భావించి పూజించు పరవనితలందరు
జగన్మాత రూపాలు త్యాగ మూర్తులని
మన్నించు మనసార పాదాలదర్శించి ॥ భజిం ॥

4. "నళినీదళగత జలమతితరళం
తద్వ జ్జీవిత మతిశయ చపలం
విద్ధివ్యాధ్యభిమాన గ్రస్తం
లోకం శోకహతంచసమస్తం" ॥ భజ ॥

చంచలమైనది మానవ జీవితం
తామరపై నున్న జలబిందువువలె
పరితప్తమైనది యీ ప్రపంచం
అనారోగ్య అభిమాన శోకాలతో || భజం ||

అనివార్యమైనవి జనన మరణాలు
భయభ్రాంతిమయమీక్షణిక జీవితం
తప్పదు మరుభూమి రారాజులకైనను
ఉన్నది అంతం ఆ బ్రహ్మకైనను || భజం ||

సహకరించదు ఐశ్వర్యమెంతైన
అనుసరించరెవరు అంతిమ సమయాన
మరెందుకో ఈ మమతానురాగాలు
నాదీ నావారనెడి అనుబంధాలు || భజం ||

శోకమయమైనవీ సకలలోకాలు
సమసి పోయేవి యీ సకల భోగాలు
అస్థిరమైనదీ అనంతసృజనం
అశాశ్వతమైనదీ మానవ జీవితం || భజం ||

5. *"యావద్విత్తో పార్జన సక్తః*
*తావన్నిజ పరివారః రక్తః*
*పశ్చాజ్జీవతి జర్జరదేహే*
*వార్తాంకోపి న పృచ్ఛతిగేహే"* *|| భజ ||*

విందురు నీ మాట విత్తమున్నచో
ఆశ్రయింతురు పరివారమంతా
దేహం శిధిలమైనచో
దరిరారెవరైనను కుశలమడుగరునిను ॥ భజం ॥

సజీవులైతే గౌరవ సత్కారాలు
మృతజీవులైతే మృణ్మయపీఠాలు
కీర్తినొందితే భజింతురెందరో
అపకీర్తిపాలైన కనరారు ఆప్తులు ॥ భజం ॥

భిక్షుకులయ్యారు సామ్రాట్టులందరు
నడివీధి నిలిచారు నాయకులందరు
తప్పవందరికి ఈ మిట్టపల్లాలు
అతిసామాన్యం మానావమానాలు ॥ భజం ॥

ఉప్పొంగిపోయేను ఒక క్షణమందు
క్రుంగిపోయేను మరుక్షణమందే
అశాశ్వతమ్మైన ఈ విశ్వమంతట
అవినాశియైనది ఆ పరమాత్మయే ॥ భజం ॥

6. "యావత్పవనో నివసతి దేహే
తావత్పృచ్ఛతి కుశలం గేహే
గతవతి వాయౌ దేహాపాయే
భార్యా భిభ్యతి తస్మిన్కాయే" ॥ భజ ॥

కుశలమడిగేరు నీ వారెవరైనా
జీవమున్న వరకే నీ దేహంలో
అవసానస్థితికి గురియైన దేహం
అంతరించి నశించు తరుణాన
నినుజేరరెవరు అడుగరుక్షేమం
భీతిల్లిదరిరాదు నీ భార్యయైన ॥ భజిం ॥

నిలువలేనిదీ పాంచభౌతిక శరీరం
జీర్ణించిపోయి భస్మమగు నొకనాడు
క్షణభంగురమగు మానవజీవితం
తెలియదెవరికి ఏ క్షణమేమగునో ॥ భజిం ॥

కూలిపోయేను కదలి కెరటాలలా
అదృశ్యమ య్యేను మెరిసిన మెరుపు
వ్యామోహకారణం దేహభ్రాంతియే
నేను నాదనెడి అజ్ఞాన బంధాలే ॥ భజిం ॥

ఉపకరించు పశుపక్షి మృత దేహములు
నిరుపయోగ మీ మానవ శరీరం
జీవి మరణించిన మరుక్షణమందే
భీతిచెందేరు తన ఆలు బిడ్డలే
తల్లడిల్లేరు శవదర్శనానికి
కనుమరుగయ్యేరు ముద్దాడు వారే
తొలగిపోయేరు మురిసిన నీవారే ॥ భజిం ॥

సన్మానించేరు స్తవము చేసేరు
మనలేము మేమని నీతోడు లేకనె
మరలిరారునీకై మరణించు సమాయాన
వీరా నీవారు, వీరికా నీ త్యాగాలు ॥ భజిం ॥

వెలవెలపోవును పక్షిలేని పంజరం
అపవిత్రమగును దైవంలేని ఆలయం
నివసించకుంటే దయ్యాలనిలయం
సరిచూడకుంటే సౌధాలు శిధిలం
మరణించినంతనే అత్తరుదేహం
రారాజుదైనా దుర్గంధభరితం ॥ భజిం॥

7. "బాలస్తావ త్క్రీడాసక్తః
తరుణస్తావ త్తరుణీ సక్తః
వృద్ధస్తావ చ్చింతాసక్తః
పరమేబ్రహ్మణి కోపి నసక్తః" ॥ భజ ॥

ఆసక్తినొందేను ఆటపాటలలో
బాలుడై నడయాడు కాలంలో,
తరలించు ఆసక్తి తరుణుల సొగసుకు
యువకుడై నర్తించు వయసుపొంగులో,
కుమిలిపోయేను చింతాక్రాంతులై
ఆవరించిన వృద్ధాప్యానికై
ఆసక్తి చూపరు భగవంతునిపై
ఏ సమయమందైన ఏ క్షణమునందైన ॥ భజిం ॥

దుర్లభమైనది మానవ జననం
అద్భుతమైనది అంతఃకరణం
అతివిశిష్ఠము అతనివివేకం
మట్టిపాలగు మందబుద్ధికివి ॥ భజిం ॥

విలువలెరుగదు వికసించని బాల్యం
వివరమెరుగదు విరబూసిన యవ్వనం
పరిణతినొందదు పరితపించు వృద్ధాప్యం
విరామమెరుగని మిథ్యాజీవితంలో ॥ భజిం ॥

పయనించరెవరు శ్రేయోమార్గాన
పరుగులు తీసేరు ప్రేయోమార్గాన
భావించు దైవాన్ని లంచగొండిగా
నిందించు ఓటమి చవిచూడగానే ॥ భజిం ॥

8. "కాతే కాన్తా కస్తే పుత్రః
సంసారః అయ మతీవ విచిత్రః
కస్య త్వం కః కుత ఆయాతః
తత్త్వం చిన్తయ తదిహ భ్రాతః" ॥ భజ ॥

అతివిచిత్ర మీ సంసార సాగరం
ఎవరివాడవో ఎటనుండి వచ్చావో
అర్ధాంగిఎవరో నీపుత్రులెవరో
చింతించు సోదర ఈ తత్త్వమరయగ ॥ భజిం ॥

ఎవరు తీర్చిరీ రంగుల హరివిల్లు
ఎవరిచ్చారీ హంగుల సిరిజల్లు
గుర్తించవైతివి విశ్వశిల్పినే
ఊడిపడితివా నీకై నీవే ॥ భజం ॥

జన్మించలేదిల ఆలుబిడ్డలతో
జతకూడినామిల బాటసారులమై
చేరిన ఆనందం చెదిరిన అనుతాపం
రాకపోకల ఈ రహదారులలో
సంసారమే ఒక చలివేంద్రము
ఈజీవితం ఒక అగ్నిగుండము ॥ భజం ॥

మృణ్మయమయమీ మానవ దేహం
మసిబారిపోయే నవద్వారపురము
తొలగించ మాలిన్యం జ్ఞానము కలిగి
వెలుగొందు చైతన్యం చీకటితొలగి ॥ భజం ॥

పుట్టుక లేకే, గిట్టుట తెలియని
సనాతనమ్మై శాశ్వతమైనది
హతము కానిది, హత్యలు చేయనిది
అమరమైనదే అమృత ఆత్మ ॥ భజం ॥

"సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చల తత్త్వం
నిశ్చల తత్త్వే జీవన్ముక్తిః"  ॥ భజం ॥

లభించు నసంగం సత్సంగముచే
తొలగించు భ్రాంతి అసంగభావం
నిర్మలమౌ మనసు, నశియింప మోహము
శ్చల మౌని[illegible] మనసే జీవన్ముక్తిల ॥ భజం ॥

యత్నించు ప్రతి జీవి, తొలగింప శోకాన్ని
ఆశించు అనుక్షణము ఆనందించగ
అంతిమ శరణం భగవంతుడేనని
శరణంచు తరియించు, గురు శాస్త్రబోధల ॥ భజం ॥

ధ్యానింప దైవాన్ని, త్యజియించు మోహాన్ని
లభించు వైరాగ్యం, సత్సంగప్రాప్తిచే
అలరించుదైవాన్ని, పూమాలదారాలు
అందించు జ్ఞానాన్ని మహనీయ సామీప్యం ॥ భజం ॥

మహనీయ సాంగత్యం మహిమాన్వితం
కలిగించు ఆత్మానాత్మ వివేకం
విష్ణుకీర్తనంమానసస్నానం
అంతర్ముఖమగు పరుగిడు మనసు ॥ భజం ॥

నశించుమోహం సత్యచింతనచే
తొలగగ మోహము శాంతించుమనసు
ప్రశాంతమనసే భక్తికి ఆధారం
శ్రద్ధాభక్తులే ముక్తికి సోపానం ॥ భజ ॥

10. "వయసి గతే కః కామ వికారః
శుష్కే నీరే కః కాసారః
క్షీణేవిత్తే కః పరివారః
జ్ఞాత్వే తత్త్వే కః సంసారః" ॥ భజ ॥

మోహమేలకలుగును వయసుమళ్లిన పిదప
సరస్సేల కనిపించు నీరింకిన పిదప
కనరారు బంధువులు సంపద తరిగిన
నశించు సంసారం శాస్త్ర బోధచే ॥ భజ ॥

అంతరించు చీకటి చిరుదీపకాంతికే
సత్యవస్తుదర్శనం అసత్యమదృశ్యం
నశించునజ్ఞానం జ్ఞాన ప్రాప్తిచే
చైతన్య గ్రహణం సంసార తరణం ॥ భజ ॥

వయసు మళ్లితే వనిత లెక్కడో
చూపు తగ్గితే రూపాలెక్కడో
వినికిడి తగ్గిన శ్రవణముండునా
చక్కదిద్దుకో దీపముండగా
నిన్ను తెలుసుకో చిత్తశుద్ధితో ॥ భజ ॥

11. "మా కురు ధన జన యౌవన గర్వం
హరతి నిమేషాత్ కాలః సర్వం
మాయామిద మఖిలం హిత్వా
బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా " ॥ భజ ॥

దర్పము కూడదు ధనమున్నందున
దంభము కూడదు పరివారముందని
గర్వము కూడదు యవ్వనముందని
ఆగదు కాలము హరించి వేయును
ఏక్షణమైనా నీ సర్వస్వం
మాయారూపం సకల ప్రపంచం
అధిగమించుమా మాయాజాలం
అందుకొనుమా ఈ బ్రహ్మపదము ॥ భజం ॥

చైతన్యవంతం ప్రాణుల జీవనం
ఆపరమాత్మయే నీ చైతన్యం
ఉన్నాడునీలోనె సర్వాత్మరూపాన
తిరుగాడు నీ వెంట ఛాయారూపాన
విశ్రాంతి యెరుగడు ఒక క్షణమైనా
మేల్కొనియుండును నిదురలోనైన
నడిపించుచుండును చుక్కానితానై
మూలాధారం నీ సుఖశాంతికి ॥ భజం ॥

నిలువదు స్థిరముగ నీ సిరి సంపద
నిలువదుపరివారం సంపదలేకయె
సవికారమయ మీ మానవదేహం
మార్పులు చెందేను ప్రతిక్షణమందున
తెరిచేను కనులు జననమందగనే
మూసేనుకనులు మరణమందగనే
రెప్పపాటు జీవికి తప్పవు తిప్పలు
అతిసనాతనం ఆత్మ చైతన్యం ॥ భజం ॥

అస్తిత్వమేలేని మాయాతత్త్వం
అధీనమై యుంది ఆపరమేశ్వరునికి
మాయమైపోవు మాయ బ్రహ్మదర్శనమున
అనిర్వచనమీమాయ భ్రాంతిజనకము
రజ్జు సర్పభ్రాంతియె మాయా జాలం
కనరాదు సర్పం ఆద్యంతాలలో
ఘటముండదిలలో మృత్తిక లేనిచో
ఆభరణముండదు స్వర్ణము లేనిచో
మేఘములుండవు నీరేమిలేనిచో
ప్రపంచముండదు పరమాత్మలేనిచో ॥ భజం ॥

12. *"దిన యామిన్యౌ సాయం ప్రాతః*
*శిశిర వసన్తౌ పునరాయాతః*
*కాలః క్రీడతి గచ్ఛతి ఆయుః*
*తదపి న ముంచతి ఆశావాయుః"* ॥ భజ ॥

వచ్చిపోతున్నాయి మళ్లీ మళ్లీ
దివారాత్రాలు, ఉదయ సంధ్యలు
క్రీడించుచున్నాయి ఈకాలమంతా
శిశిరవసంతాలు, ప్రభవాదివత్సరాలు

నీటిబుడగ ఈ జీవనయానం
క్షీణించేదే జీవులప్రాయం
అయినను వదలడు ఆశాపాశం
లోభమోహాల బానిసజీవుడు ॥ భజం ॥

యాత్రికులమైతిమి అనంతయాత్రలో
జీవించుచుంటిమి కాలత్రయములో
గతించిపోయేను క్షణమొక్కక్షణమున
జనన మరణాల రంగస్థలి యీ విశ్వం
నటించి నిష్క్రమించుపాత్రధారులం మనం
ఆడించుచున్నవి రాగద్వేషములు
పాడించుచున్నవి మమతానురాగాలు
ఆశించరమరత్వ అమితాశ్చర్యం ॥ భజం ॥

13. "కాతే కాన్తా ధనగత చిన్తా
వాతుల కింతవ నాస్తి నియన్తా
త్రిజగతి సజ్జన సంగతి రేకా
భవతి భవార్ణవ తరణే నౌకా" ॥ భజ ॥

చింతించ నేలనో ఓ వెర్రివాడా
కాంతాకనకాల దాసుడవై నీవు
లేడనుకొంటివా విశ్వనియంతయే
ధర్మాధర్మాల పరిరక్షింపగా
దాటించునౌకయే భవసాగరాన్ని
త్రికాలాలలోని సజ్జనసాంగత్యం
త్రిసంధ్యలయందలి దైవధ్యానం
తెలిసిమసలుకో తెలివైన వానిగా ॥ భజిం ॥

అమూల్యమైనదీ మానవ జీవితం
అనిత్యమైనదీ విశాల ప్రపంచం
అనుచితమగునీ ధనధాన్యచింతనం
కలుషితమగునీ అంతః కరణం
నిష్ఫలమగునీ మానవజననం
చేయాలి ధ్యానమ్ము మరువకనిరతం
చేరాలిగమ్యమ్ము విడువక సాధన
మోక్షసాధనమే జన్మసాఫల్యం ॥ భ ॥

బంధమన్నది భావనమాత్రమే
లేనే లేవిల బంధమోక్షములు
నిత్యముక్తమైనది శుద్ధాంతరాత్మ
స్వయం ప్రకాశం, స్వయం సిద్ధము
చరించు నావే జఱ ప్రవహించు జలమున
ఆనావయానమే జీవనమీ యిల
భయమేలనోయి సంసారమందు
రక్షించునోయి సజ్జన సాంగత్యం ॥ భజిం ॥

మేఘాలేర్పడును సూర్యునితాపాన

ఆవరించు సూర్యుని ఆ మేఘాలే

తొలగును మేఘాలు చల్లని గాలికి

నిర్మలమగు వర్షించినంతనె

ఈ విధమైనదే సంసారబంధం

బంధమూలము చైతన్యచిత్తము

చిత్తశుద్ధియే జ్ఞానసాధనం

జ్ఞానమార్గమే మోక్షదాయకం ॥ భజిం ॥

14. "జటిలో ముణ్డీ లుంఛిత కేశః
కాషాయాంబర బహుకృత వేషః
పశ్యన్నపిచ న పశ్యతి మూఢః
ఉదర నిమిత్తం బహుకృత వేషః ॥ భజ ॥

జడలు ధరింతురు, ముండనమొనర్తురు

చెదరిన కేశాలు కొందరివైతే

కాషాయధారణమె ఇంకొందరిది

వేషమెవేరైన నామమె మారినా

కనలేరుసత్యం ఈ మూఢులంతా

ఉదర నిమిత్తం బహువేషధారణ ॥ భజిం ॥

కాషాయమేనా సన్యాసమంటే
ముండనమేనా వైరాగ్యమంటే
సాధువులగుదురా జడధారులంతా
భిక్షాటనకైకాదు సన్యాస దీక్షలు
మోక్షసాధనే సన్యాస లక్ష్యం ॥ భజిం ॥

కాలేడు సన్యాసి కాషాయధారి
మనలేడునీతిగ కాకీధారీ
కాలేడు భక్తుడు ఖద్దరుటోపీ
మిథ్యాచార్యులు, గోముఖవ్యాఘ్రాలు
సంచరింతురీ సమాజమంతటా
సంకేతమవదిల బాహ్యాడంబరం
చిత్తశుద్ధికై నా ఆత్మవిద్యకైనా
మోహములుండవు సర్వాత్మదృష్టిలో ॥ భజిం ॥

15. "అంగం గలితం పలితం ముణ్డం
దశన విహీనం జాతం తుణ్డం
వృద్ధోయాతి గృహీత్వా దణ్డం
తదపి న ముంచతి ఆశాపిణ్డం" ॥ భజ ॥

వడలిని దేహం, నెరిసిన శిరమైన
ఊడినదంతం, ముక్కాలినడకైన
వీడరు మోహం వదలరు లోభం
వికాసమేలేని విద్యావిహీనులు ॥ భజం ॥

నిర్ణయించు గమ్యం, తనలోని వాంఛ
అనుభవమగును అభిరుచులె అలవాటై
సవరించు శీలాన్ని ఆ అనుభవాలు
కోరేను సొగసులు వయసున్న మనసులు
పరితాపమందేను పరిణతి నొందక
అడుగిడలేకున్న అందలమెక్కిన
కలిగించునధోగతి ఆశాపాశం
అలమటించేను అందని ఫలముకై ॥ భజం ॥

జనన మరణాల, శోకచింతనల,
వార్ధక్యరోగాల, వ్యథలవెతలను
అనుస్మరించాలి అనుక్షణమనుచు
హెచ్చరించిరి గీతాచార్యులే
సదాచార సద్భావములతో
సాగించు జీవన సంసారయాత్ర ॥ భజం ॥

16. "అగ్రే వహ్నిః పృష్ఠే భానూ
రాత్రౌ చుబుక సమర్పిత జాను :
కరతల భిక్షః తరుతల వాసః
తదపి నముంచతి ఆశాపాశ :" ॥ భజ ॥

తనముందు చలిమంట, తన వెనుకరి సూర్యుండు
ఆనించుగడ్డం మోకాలి పై రాత్రి
స్వీకరించు భిక్షాన్నం తనదోసిలితో
జీవించు తరుఛాయ అల్పకామనలతో ॥ భజిం ॥

కటికనేలయే పవళించు పానుపు
నీలాకాశమే ~~అతని దోమలతెర~~ నిండైన కంబళం
తనదేమిలేక, తనవారు లేక
సాగించుచుండేను ఏకాకి జీవనం
త్యజియించు సర్వమ్ము వైరాగ్యముతో
కొనసాగించుథ దుర్భర జీవితం
అయినను వీడడు, అల్పమైన కామనల ॥ భజిం ॥

దూరంకానివే దీనులకైనాను
నికృష్టవాంఛలు, లోభమోహాలు
ఇదేమి జీవనం, విధిబలీయమో
అతిదీనమౌ అసహాయవృద్ధాప్యం
దిక్కులేని జీవికి ఇది సౌభాగ్యమా
దిక్కుమాలిన బ్రతుకే దౌర్భాగ్యమా
వైరాగ్యముదయించి, జ్ఞానముపొందుచు
పరంధాముదరిజేర సరియగుతరుణం
తెలియరు పాపం, అభాగ్యజీవులు ॥ భజిం ॥

17. "కురుతే గంగా సాగర గమనం
వ్రత పరిపాలన మథవాదానం
జ్ఞాన విహీనః సర్వ మతేన
ముక్తిం నభజతి జన్మశతేన"   ॥ భజ ॥

గంగా సంగమతీర్థయాత్రలు
ఆశలు తీరగ చేసెడి వ్రతములు
పుణ్యప్రాప్తికై చేయుదానములు
శతకోటిజన్మల జ్ఞానహీనులకిల
కలగదు విరక్తి లభించదు ముక్తి   ॥ భజం ॥

విహార స్థలములు కావీ తీర్థయాత్రలు
భావశుద్ధిగల భక్తియే ముఖ్యము
చిత్తశుద్ధిగల చింతన ప్రధానం
ఆత్మైక్యసంధానమే అతి విశిష్ఠము
ఆధ్యాత్మిక అవగాహనే ఆవశ్యకము   ॥ భజం ॥

ధర్మము చేయుట సౌభాగ్యయోగం
అవకాశమిచ్చేటి గ్రహీత దైవం
ప్రఖ్యాతి నాశించి చేసెడి ధర్మం
ధర్మం కాదది ప్రారబ్ధఖర్మం
పరమాత్మ సేవలో ప్రతిఫలమెంచక
ఆచరించు ధర్మం ఆత్మాభరణం   ॥ భజం ॥

18. "సురమందిర తరుమూల నివాసః
శయ్యాభూతల మజినం వాసః
సర్వ పరిగ్రహ భోగత్యాగః
కస్య సుఖం న కరోతి విరాగః" ॥ భజ ॥

ఆశ్రయించు ఆలయాల, తరుమూల ఛాయల
పవళించు వెచ్చని భూమాత ఒడిలో
మృగచర్మధారణ, సర్వకర్మత్యాగం
వాంఛలేని వైరాగ్యం, ఎవరికివ్వవు ఆనందం ॥ భజం ॥

భాసించు నాత్మ తృప్తితో నిజమైన వైరాగ్యం
భావించు తృణ ప్రాయముగ ప్రాప్తించిన ఆధిపత్యం
సర్వబంధమూలం అనుచిత సంబంధం
మిథ్యామాత్రం నామరూపాలు, రాగ బంధాలని
నిరాకరించును నిర్మోహాన సత్యదర్శనజ్ఞాని
దోష దర్శనం, ద్వేష నివారణం, కాలుష్యపరిత్యాగం
అహంకార మమకారత్యాజ్యం, బాహ్యాభ్యంతర విరక్తిభావం
ఆంతరంగిక వైరాగ్యం, అమృతమయమౌ ఆనందధామం॥ భజం ॥

19. "యోగరతో వా భోగరతో వా
సంగరతో వా సంగ విహీనః
యస్య బ్రహ్మణి రమతే చిత్తం
నన్దతి నన్దతి నన్దత్యేవ" ॥ భజ ॥

యోగమనురించినా భోగమనుభవించినా
సమూహనివాసం ఏకాంతవాసమని
రమించు మనసే బ్రహ్మచింతనలో
అనుభవించు సౌఖ్యానందం
పరవశించు పరమానందాన ॥ భజం ॥

చైతన్యమయమీ విశ్వమంతయు
ముందువెనుకల తూర్పుపడమర
బాహ్యాంతరాల దేహ భావనయె
సూక్ష్మతమమౌ చైతన్య స్థాయికి
అంతామిథ్యయే ఉన్నది సత్యమే ॥ భజం ॥

అతీతమైనది ఆత్మ చైతన్యం
దేశకాల బంధమోక్షాలకు
భాసించుమనసు చైతన్యజ్యోతిచే
గ్రహించలేదు స్వప్రకాశచైతన్యం
అధిగమించలేడు మనోదేహస్థాయిని
యోగి, భోగి, విరాగియైనను
గుహలో వున్నను, గుంపునవున్నను
స్థిత ప్రజ్ఞుడైన ఏకాంత జీవి ॥ భజం ॥

పర్యటింతురు కొందరు జ్ఞానులు
పదుగురి కొరకై ప్రపంచమంతా
పర్యటించకే తరింపజేతురు
మౌన బోధచే మరికొందరు

ఎంత తిరిగినా, ఏ విధి చేసినా
మసలేరు సత్యాన మనుగడ ఏదైన
అత్యంతదూరం అనాత్మభావం
అతిసామీప్యం సర్వాత్మభావం ॥ భజం ॥

20. "భగవద్గీతా కించదధీతా
గంగాజల లవ కణికా పీతా
సకృదపి యేన మురారి సమర్చా
క్రియతే తస్య యమేన నచర్చా" ॥ భజ ॥

ఏ కొంచమైనా భగవద్గీతను
అధ్యయనం చేసినదెవరైనగాని
ఏ కొంచమైనా గంగాజలమును
పానం చేసిన పావనులెవరైన
ఏ కొంచమైనా కృష్ణుని ధ్యానం
చేసే దెవరైన చిత్తశుద్ధితో
చలించబోరు సమవర్తిముందైన
వాదించపనిలేదు యమధర్మరాజుతో ॥ భజం ॥

బోధించెగీతను భగవానుడేయిల
నిమిత్తమాత్రుడౌ సవ్యసాచికి
విశ్వవ్యాపకము గీతాశాస్త్రము
మానవులందరి మోక్షశాస్త్రము
శోక విముక్తికి గీతా శ్రవణం
బంధ విముక్తికి గీతా మననం
జీవన్ముక్తికినిధిధ్యాసనం ॥ భజం ॥

తననుతానే మరచిన దేవుని జీవుడందురు
తనను తానే తెలిసిన జీవుని దేవుడందురు
హరించిపోవును సకల పాపములు
గంగాజల స్నానముతో
ధర్మరక్షకుడు వాసుదేవుని
ద్వాదశాక్షరి మంత్రజపమునే
పవిత్రమనసుతో, పరిశుద్ధచిత్తాన
ధ్యానించువారిని చేరడు యముడైన
భస్మమగును సంచిత కర్మము
తొలగిపోవు మరణించు భయము ॥ భజిం ॥

21. "పునరపి జననం పునరపి మరణం
పునరపి జననీ జఠరేశయనం
ఇహ సంసారే బహుదుస్తారే
కృపయా అపారే పాహిమురారే" ॥ భజ ॥

అసాధ్యమగును అధిగమించుటే
మాతృగర్భా శయ నివాసం
జననమరణం, మరణ జననం
అతిక్రమించుట, అతి దుర్లభము
సంసారసాగర తరణము ఇలలో
అతి దుస్తరము, అతి దుర్భరము
ధన్యతనొందాలి దైవధ్యానాన
ఆశ్రయమందాలి కరుణామూర్తిని ॥ భజిం ॥

గత జన్మ కర్మల ఫలమే జననం
ప్రారబ్ధకర్మల సమాప్తి మరణం
పుణ్యపాపములే సుఖదుఃఖమూలం
నిర్ణయించు కర్మాచరణం భావి జన్మలను
పరిభ్రమించును పరితప్త హృదయాన
దుఃఖభాజనుడై జీవన సుడిగుండాల
విలవిలలాడును సంసార సంగ్రామంలో ॥ భజిం ॥

అందును ఫలములు కర్మానుసారం
అనుసరించునవి ధర్మనియమముల
వెంటాడు జీవుల గత జన్మకర్మములె
అనుసరించు తల్లిని పసిబాలురవలె
కలుసుకుంటాము వివిధ కాలాలలో
కలసి తిరిగేము మరికొంత కాలము
తిరిగి పోయేము దిక్కులకొకకరమై
కనుమరుగయ్యేము మరుక్షణమందే ॥ భజిం ॥

విధి ఆడించే వింతనాటకం
విశ్వమాయలో కీలుబొమ్మలం
వింతలుగొలిపే విశ్వనాటకం
అద్భుతమైనా అంతము తప్పదు
ఆగదు నిష్క్రమణ ఏ పాత్రకైనా
అనుగ్రహించుమా ఆదరించుమా
అర్పించుకుందును నీ దివ్యచరణాల
దీవించి మాకిల ముక్తి నొసగుమా ॥ భజిం ॥

22. "రథ్యా చర్పట విరచిత కన్థః
పుణ్యాపుణ్య వివర్జిత పన్థః
యోగీయోగ నియోజిత చిత్తః
రమతే బాలోన్మత్తవ దేవ" || భజ ||

ప్రోగుచేయును జీర్ణ వస్త్రములను
ధరించుచుండును బొంతగ మార్చి
అనుసరించును పుణ్య పాపములకు
అతీతమైనట్టి మార్గగమనమే
నియమించు మనసును పూర్ణయోగాన
సంచరించుచుండు పసివానివలెనో
విహరించుచుండును వెర్రివానివలెనో
నడయాడు నవ్వుల కూలబడు శోకాన

ఆధారపడడు ఇతరులదయపై
అతీతుడగును అవసరాల కీయిల
రుచించవతనికి అభినందనాలు
ఆశించడతడు అభివందనలు
అన్నీ వున్నా అలమటించునజ్ఞాని
ఏమీలేకనే ఆనందించు జ్ఞాని
సాగించుజీవనం శాంత చిత్తాన
దురాతిదూరం చితిలాంటి చింతన || భజిం ||

తిరుగుచుండును తిరుగని వానిలా
చూచుచుండును చూడనివానిలా
పలుకుచుండును మూగవానిలా
వినుచుండేను వినని వానిలా
వాదించుచుండును ముందెవరు లేకనే
అవలోకించును దూరాకాశాల
పరిహసింతురు వెర్రివాడనుచు
గుర్తించలేరతని ఆత్మానందం ॥ భజం ॥

23. "కస్త్వం కోహం కుత ఆయాతః
కామే జననీ కోమే తాతః
ఇతి పరిభావయ సర్వమసారం
విశ్వంత్యక్త్వా స్వప్న విచారం" ॥ భజ ॥

నీవెవరివాడవో నేనెవరివాడనో
నీ తల్లి ఎవరో నీ తండ్రి ఎవరో
స్వప్నతుల్యమైనదీ సారహీన విశ్వం
వదిలించుకో జీవా తత్త్వవిచారణచే ॥ భజం ॥

అంతు తెలియవు మనసులోతులు
తృప్తి చెందదు ప్రాప్తించుదానికి
అర్రులు జాచును అందని దానికి
అలమటించును ఆశలు తీరక
ఆక్రోశించును నిస్సహాయతకు
తపన చెందేను తన ఓటమికి
సతమతమయ్యేను సంతృప్తినొందక
లోభమోహముల బానిసతానై ॥ భజం ॥

అన్నీ తెలిసిన అజ్ఞానిని నే
ఆత్మనెరుగని అవివేకిని నే
ఎన్ని తెలిసినా ఏమి నేర్చినా
ఫలితమేముండు పరము తెలియకే
తెలిసినదంతా అనాత్మమయము
తెలియనిదంతా అయోమయము
తెలిసేది కాదు తెలియనిది కాదు
తెలియలేనిది కానే కాదు
స్వయం సిద్ధము ఆత్మ జ్ఞానము
స్వయం ప్రకాశము ఆత్మ స్వరూపము ॥ భజ౦ ॥

24. "త్వయిమయి చాన్యత్రైకోవిష్ణు :
వ్యర్థం కుప్యసిమయ్య సహిష్ణు :
భవసమచిత్తః సర్వత్ర త్వం
వాంఛస్య చిరాద్యది విష్ణుత్వం" ॥ భజ ॥

నీలో వున్నది నాలో వున్నది
ఉన్నదంతటా సర్వ వ్యాపియే
కోపగించేవు ఓరిమిలేకనె
కలిగియుండాలి సర్వాత్మదృష్టిని
పొందగోరితే విష్ణుపదమునే ॥ భజ౦ ॥

అనుభవించేరు తరించుచుండేరు
అందరిని తనవలె దర్శించువారు
సంచరించేరు స్థిర చిత్తముతో
వీక్షించలేరు విశ్వాత్మతత్త్వం
అనుభవశూన్యులు అస్థిర చిత్తులు
వ్యర్థం నిరర్థకం అసమర్థుని కోపం
ఆచరణయోగ్యం వేదాంత శ్రవణం
అనవరతమననం అనితరధ్యానం
అత్యావశ్యకం జ్ఞాననిష్ఠకు ॥ భజిం ॥

మార్పులు సహజం స్థితిగతులన్నిట
కూర్పులు చేర్పులు తప్పవు తిప్పలు
పరాధీనాలవి ప్రకృతి సహజాలు
మారే జగతికి మారని అధిపతి
అధికారియైన ఆచైతన్యం
సమదర్శనమే వుండాలి మార్పులో
కోపతాపాలు ఎవరికి ఎవరిపై
సత్యం తెలిసిన అంతం ఆవేశం
సర్వం తెలిసిన సత్యమె ఆనందం ॥ భజిం ॥

25. "శత్రౌమిత్రే పుత్రేబన్ధౌ
మాకురు యత్నం విగ్రహసన్ధౌ
సర్వస్మిన్నపి పశ్యాత్మానం
సర్వత్రోత్సృజ భేదాజ్ఞానం" ॥భజ॥

పలకాలి స్వస్తి శత్రుత్వ స్నేహాలకు
పుత్రుడైనను, బంధువైనను
తొలగించుకోవాలి అనురాగ ద్వేషాల
వదలించుకోవాలి భేదభావాల
దర్శించగలగాలి ఆత్మను అందరిలో ॥ భజం ॥

వ్యాపించు చీకటి వెలుగేలేకున్న
సత్యములోపింప అనృతమెపాలించు
ధర్మనాశనం దుష్టులవిన్యాసం
జ్ఞాన లేమియే అజ్ఞాన ఆవరణం
ఉన్నది లేనట్లు లేనివి ఉన్నట్లు
కలిగించు భ్రాంతిని మాయాసారథ్యం
త్యజించవలెనా భేదబుద్ధినే
అనుసరించవలె అభేదజ్ఞానాన్ని ॥ భజం ॥

సత్యదర్శనం సమత్వ దర్శనం
అవతరించును సమరసభావం
అంతరించును తరతమభేదం
సర్వాత్మ దర్శనం సర్వజన ఆమోదం
అవగాహనుంటే ఆత్మయె ఆప్తుడు
అపార్థమైతే ఆత్మయె శత్రువు
నరకమె స్వర్గం సద్భావనకు
స్వర్గమెనరకం దుర్భావనకు ॥ భజం ॥

26 "కామం క్రోధం లోభం మోహం
త్యక్త్వాత్మానం పశ్యతి సోహం
ఆత్మజ్ఞాన విహీనామూఢాః
తే పచ్యన్తే నరక నిగూఢాః" ॥భజ॥

కామక్రోధ లోభమోహములే
దుర్గుణ చతుష్టయమీయిలలో
అణచి వేయునవి ఆధ్యాత్మిక జ్యోతిని
అనుసరింపజేయు నిరర్థక జీవనం
దరిజేర్చు మృత్యువుకు తరలించు చితిపైకి
శవవాహకులైన ఆ నాల్గు అవగుణమ్ములు ॥ భజం ॥

జనించు వాంఛలు అజ్ఞానవశమున
జ్వలించుక్రోధం తీరని వాంఛలకు
పడత్రోయు నిన్ను లోభ, మోహాలు
కామక్రోధముల అగ్నిజ్వాలలో
కోరిన కలగదు క్రోధమెన్నడు
సంఘటనాత్మకం క్రోధభావము
తొలగును క్రోధం శాంతచిత్తమున
జయించుక్రోధం సువిచారణతో ॥ భజం ॥

సత్యమసత్యమని, అసత్యం సత్యమని
భావించు మోహావేశాన
దప్పికతీరునా ఎండమావినీటితో
వెండిలభించునా ముత్యపుచిప్పలో
సత్యదర్శనమె మోహనాశనం
మోహనాశనమె ఆత్మానుసంధానం ॥ భజం ॥

27 "గేయం గీతానామ సహస్రం
ధ్యేయం శ్రీపతి రూపమజస్రం
నేయం సజ్జన సంగే చిత్తం
దేయం దీన జనాయచ విత్తం ||భజ||

కీర్తించు మనసా విష్ణునామముల
పఠించు శ్రద్ధతో భగవద్గీతను
ధ్యానించు నిరతం విష్ణు రూపమును
నడిపించు మనసా సత్సంగమునకు
సహకరించు మానవా దీనజనులకు || భజం ||

గానంచేసెను స్వయముగ దైవం
శాస్త్రసారమైన గీతాగానం
నిమిత్తమాత్రుడు పాండవ మధ్యముడు
ఆస్తికజనులకై ఆలపించిన గీతకు
తరింపజేసెను దివ్యోపదేశాన
తపించుచుండిన జిజ్ఞాసులందరికి || భజం ||

విష్ణునామ పారాయణం విష్ణుమూర్తికి నీరాజనం
తొలగించుపాపాలు వెలిగించు దీపాలు
వేణునామాలే వెన్నుని వైభవం
ప్రకటించుచున్నవి శివకేశవ అభేదం
అలరారు ప్రతినామమే భాసించు ప్రతిరూపమై
చేర్చును నామం నామిచెంతకు

లేదేమి భేదం నామికినామానికి
భగవన్నామమే దాటించునౌక
కలియుగమందలి భవసాగరమును
భక్తికలిగితే భగవంతుడవీవు
దర్శించగలవు దైవాన్ని అందరిలో
సత్యమెరిగితే అద్భుతయోగం
ఎరుగనివారికి విషాదయోగం ॥ భజం ॥

28 "సుఖతః క్రియతేరామాభోగః
పశ్చాద్ధన్త శరీరేరోగః
యద్యపిలోకే మరణంశరణం
తదపినముంచతి పాపాచరణం" ॥భజ॥

అనుభవించుజీవి భోగజీవితం
లైంగికవికారపు మోహభ్రాంతిచే
రోగాలమయమగును మానవదేహం
నిర్వీర్యమైపోవు భావిజీవనం
త్యజించకున్నాడు పాపవర్తనం
అనివార్య మరణం పొంచియుండినా ॥ భజం ॥

ఈనాటి సుఖజీవనం రేపటికి దుఃఖకారణం
భోగలాలసతే రోగ గ్రస్తము
భోగజీవితం రోగ ఆశ్రితం
విషయసుఖాలే విషపూరితాలు
సంచరించాలి విజ్ఞతనొంది
పరిహరించాలి పరిణతినొంది
అల్పసౌఖ్యాల తుచ్ఛవాంఛల ॥ భజం ॥

సంపదలెన్నున్నా భోగాలెన్నైనా
శాశ్వతమగునా ఈ సుఖజీవనం
తప్పదుతుదకీ శరీరపతనం
గిట్టుట అనివార్యం పుట్టిన ప్రతిజీవికి
మట్టిపాలగు సుసంపన్న దేహం
పంచభూతాలచేరు పాంచభౌతిక దేహం || భజం ||

మరణింతునని తెలిసి మానవుడేలనో
త్యజించలేకుండె పాపకార్యముల
నిత్యసత్యమై భాసించు ఆత్మపై
నిండుమనసును లగ్నంచేసిన
సిద్ధించుతప్పక అమృతత్వమని
లభించు నిజముగ అనంతాత్మయని || భజం ||

*29* "అర్థమనర్థం భావయనిత్యం
నాస్తి తతః సుఖలేశః సత్యం
పుత్రాదపి ధనబాజాం భీతిః
సర్వత్రైషా విహితా రీతిః" ||భజ||

సిరిసంపదలే దుఃఖయోనులు
మరిచిపోకు మీ సత్యమెన్నడు
సుఖమేలేదిల వాస్తవమిదియే
భీతి చెందేను అనుక్షణమందు
పుత్రునికాంచిన ధనవంతులే
ఎక్కడైన్ననూ ఏనాడైనను
అధోగతియే అధికసంపదకు || భజం ||

నరకతుల్యమీ భోగజీవితం
విసర్జనీయమీ ధన వ్యామోహం
ప్రవహించు జలము పల్లపుప్రాంతాల
పయనించుదీపం ఊర్ధ్వలోకాల
కలిగించు దుర్గతి అత్యాశలోభం
అందించుసద్గతి ధర్మానుసరణం || భజిం ||

నియమాలనిలయం జంతు ప్రపంచం
ఆకలితీరిన అలమటించవు మరునాటికై
ఆశాపాశాలు అగుపించవసలు
రాగద్వేషాలు అసలేవుండవు
ప్రశాంతమనుగడ సంతృప్తజీవనం
ఆదర్శమవ్వాలి అతి నీచ జీవులకు || భజిం ||

అదుపేలేదిల మనిషివాంఛకు
అసూయద్వేషాల ప్రతిరూపం
దుర్గుణాలకే కోరిక నిలయం
కోపాద్రేకాల అతిక్రూరం
స్వార్థజీవనం మానవధ్యేయం
ఆర్జన చేయును అక్రమమార్గాల
కూల్చివేయును ఇతరులకొంపలు
దాచియుంచునిధి తర తరాలకు
నైతికవిలువల నశింపజేసే
ధనమే అనర్థం మానవజాతికి || భజిం ||

అశాంతినిలయం ధనికులజీవితం
స్పర్ధకుమూలం మానవస్వార్థం
కనరాదువారిలో సమరస భావం
ప్రతిదినవేడుక సమరమెవారికి
సమరాంగణమను పూవులపాన్పుపై
సకలసంపదలే సంపెంగపూవులు
ఉదయించినా విషసర్పములచ్చోట
వినాశనమ్మే విందులువారికి ॥ భజిం ॥

30 "ప్రాణాయామం ప్రత్యాహారం
నిత్యానిత్య వివేకవిచారం
జాప్యసమేత సమాధివిధానం
కుర్వవధానం మహదవధానం" ॥ భజ ॥

అనుష్ఠించాలి అతిమెలకువతో
ప్రాణాయామం ప్రత్యాహారం
అనుష్ఠించాలి అతిజాగ్రత్తతో
ఆత్మానాత్మవివేకం, జపసమాధులు ॥ భజిం ॥

అనుసరింతురు అష్టాంగ యోగం
సాధింపకోరి ఆత్మ దర్శనం
ఉపకరించునవి చిత్తశుద్ధికే
పొందాలి జ్ఞానం వైరాగ్యభావాన
మోక్షసాధనకు ముముక్షువులు
"జ్ఞానాదేవతుకైవల్యం" శ్రుతి ఉపదేశమ్మిదియే ॥ భజిం ॥

త్వరపడ కూడదు సాధనసమయాన
చేటగునుద్వేగం సాధన క్రమమున
సిద్ధిపంనీయదు అనుభవమను ఆత్రం
అంతము చేయును సాధననంతను
సహనమె మార్గం సాధనవిజయం ॥ భజిం ॥

31. "గురు చరణాంబుజ నిర్భరభక్తః
సంసారా దచిరా ద్భవ ముక్తః
సేంద్రియ మానస నియామాదేవం
ద్రక్ష్యసి నిజ హృదయస్థం దేవం" ॥భజ॥

గురుచరణ సేవయె అతిముఖ్యము
శాస్త్రవిచారణె అత్యంత అవసరం
నిగ్రహించాలి ఇంద్రియమనముల
ముక్తిని పొందాలి సంసారము నుండి
దర్శించెదవు నీ హృదయమందే
అధివసించిన ఆ దేవదేవుని ॥ భజిం ॥

ఆలకించారు అవతారపురుషులే
గురుశాస్త్ర వాక్యాల నతిశ్రద్ధతో
సాధ్యమగునా సామాన్యులకిల
అతితేలికగా ఆత్మజ్ఞానము

గురువుచెంత నేర్వని విద్యలు
విద్యలుకావవి విపత్తులు
సద్గురువీయిలలో శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడే
తరించితాను తరింపజేయును
నడిపించగలుగును ఆ సద్గురువే
శిష్యుల సరియైన మార్గమునే ॥ భజిం ॥

ఆశ్రయించాలి అన్వేషించి
అనువైనగురువును ఆత్మవిద్యకై
వందనముచేసి, పదసేవచేసి
ప్రశ్నించవలెను ఉపదేశమివగా ॥ భజిం ॥

బోధించుముందుగ శిష్యులందరికి
నిగ్రహించమని దేహేంద్రియముల
ఉపదేశించును శమదమాదులను
ఆదేశించును లయింపమనసును
ఏకాగ్రచిత్తాన ఆత్మపై అనవరతం ॥ భజిం ॥

శ్రవణ మనన నిధిధ్యాసనలే
సోపానాలగు ఆత్మజ్ఞానానికి
అపూర్వమైనది ఆత్మానుభూతి
అనుగ్రహించు నా గురువు

వేదాంత బోధను

వర్ధిల్లు చున్నది సనాతనధర్మం

గురుశిష్యపరంపరాగత

సంప్రదాయ బోధలో

విశిష్ఠమైనది వైదిక ధర్మం

వికసించు మేధస్సు

పరిణతినొందును పరమార్ధబోధతో

ముక్తినొందెరు మోక్షగాములు ॥ భజిం ॥

– ఓం తత్సత్ –